# స్వరాజ్యాందోళన పరిస్థితులు

బాబుగేను వర్ధంతోత్సవముల సందర్భమున బొంబాయిలో అరెస్టు చేయబడిన బొంబాయి మునిసిపల్ కార్పొరేషను సభ్యులు ౧౧ మందిని ప్రధాన ప్రెసిడెన్సీ మేజిస్ట్రేటు విచారించి సాక్ష్యము చాలదని వదలిపెట్టిరి. అయినను సి. ఐ. డి వారు వారినందరిని వెంటనే స్పెషలుపవర్సు ఆర్డినెన్సు క్రింద అరెస్టు చేసిరి.

పూర్వ బెంగాలునందు పన్నుల నిరాకరింపజేయుటకు ఉద్యమించుటచే సంవత్సరము శిక్ష ననుభవించిన పాలిశేషుల హరిగ్నారు డిశంబరు ౨౨ వ తేది విడుదల చేయబడిరి. అయినను జైలువాకిటనే బెంగాలు క్రిమినలు లా అమెండుమెంటు చట్టము ననుసరించి అరెస్టు చేయబడిరి.

కాంగ్రెసువారి యాజమాన్యమున జరిగిన బహిరంగ సభలో ఉపన్యసించినందులకు బాబు మోహనలాలు సక్సేన గారికి ౬ నెలల కఠినశిక్ష విధింపబడెను

మదరాసు నివాసియగు శ్రీపాద శంకరవర్మ గారు స్వదేశీ వ్యాపారమునకై బొంబాయివచ్చిరి డిశంబరు ౨౨ వ తేది ఉదయము పోలీసులు వారి వసతి కేగి పోలీసు ఆఫీసుకు తీసికొనిపోయి సాయంత్రము ౪ గంటల వరకు నిర్బంధమందుంచిరి. ౨౩ వ తేది రాత్రి ౧౨ గంటలలోగా బొంబాయి వదలిపోవలెననియు వ్రాతమూలకముగ పోలీసుకమీషనరుగారి ఉత్తరువులేక తిరిగి రాకూడదనియు శంకరవర్మ గారు ఆజ్ఞాపింపబడిరి.

డిశంబరు ౧౫ వ తేదినాడు వంగరాష్ట్రము నందలి కారాగృహములనుండి ౨౦ మంది రాజకీయ ఖైదీలు అండమానుదీవులకు పంపబడిరని తెలియుచున్నది

చిట్టగాంగు ఆయుధాగారమందు దొమ్మి జరిగిన సందర్భమున శీతారాం విశ్వాసు గారిని పట్టియిచ్చువారికి గాని, వారిని అరెస్టు చేయుటకు తగు జాడలను తెల్పువారికి గాని వేయి రూపాయిలు బహుమాన మివ్వబడునని ప్రభుత్వము వారు ప్రకటించియుండిరి. డిశంబరు ౨౧ వ తేదినాడు బర్మా పోలీసు వారు శీతారామ విశ్వాసుగారిని అరెస్టు చేసిరని వార్త వచ్చెను.

కేరళరాష్ట్ర కాంగ్రెసు కార్యదర్శియగు టి. యన్. రామున్ మీనను గారికి ౧ సంవత్సరం కఠినశిక్షయు మరి ౧౧ మందికి మూడేసి నెలల కఠినశిక్షయు విధింపబడినది.

భగత్‌సింగు కుట్రకేసు ముద్దాయిలను అండమాను దీవులకు పంపకూడదని యుపన్యసించినందున విద్యార్థి సంఘాధ్యక్షులగు ఆత్మప్రకాశ గారినుండి లాహోరు ప్రధాన మేజిస్ట్రేటుగారు రు ౫౦౦౦ ల జామీనుకోరిరి. జామీను చెల్లించనిచో ౧ సంవత్సరము జైలులో నుంచబడును.

డిశంబరు ౨౨ వ తేదీనాడు ఢిల్లీలో విదేశవస్త్ర దుకాణముల పికెటింగు చేసినందున స్పెషల్ పవర్సు ఆర్డినెన్సు ననుసరించి ఇద్దరు కాంగ్రెసు వాలంటీర్లు అరెస్టు చేయబడిరి.

లక్నో రాష్ట్రమునకు డిక్టేటరగు లాల్ సాజీవ గారికి ౬ నెలల కఠినశిక్ష విధింపబడినది.

డిశంబరు ౧౭ వ తేదీ సాయంకాలము ఆలెప్పిలో ఊర్మిళాదేవియు కొండా వెంకటప్పయ్యయు బహిరంగ సభలో అస్పృశ్యతా నివారణమును గూర్చి యుపన్యసించిన తరువాత రెడ్డివర్గమువారికి చేరిన వెంకటాచలపతి దేవాలయము లోనికి హరిజనులను రానిచ్చిరి

# దేవాలయ ప్రవేశపు బిల్లులు

జనవరి ౧౫ లోగా కేంద్ర ప్రభుత్వమువారు తమ యభిప్రాయము నీయజాలమనుట

ప్రభుత్వ ప్రకటన

మద్రాసు: డిశంబరు, ౨౩—

ప్రభుత్వమువారు యీక్రింది ప్రకటనను గావించినారు. "మదరాసు గవర్నమెంటువారు ఇండియా గవర్నమెంటువారికి పంపిన డాక్టరు సుబ్బరాయన్ నారాయణ నంబియార్ల గార్ల (దేవాలయ ప్రవేశపు) బి[illegible]చి ఆ సదరుబిల్లులు కొన్ని ముఖ్య[illegible] లేవదీయుచున్నవనియు వాటి విషయమై రాష్ట్రీయ ప్రభుత్వముల నడిగి కనుకొనవలసి యుండుననియు యిండియా ప్రభుత్వమువారు బదులిచ్చినారు.

ఈ బిల్లుల యుద్దేశ్యములవంటి యుద్దేశ్యము లేగల మరియొక బిల్లును భారత శాసనసభలో చర్చించుట కనుమతిగోరినారు. ఈ విషయమును రాష్ట్రీయ ప్రభుత్వములు బాగుగా నాలోచించి తమ యభిప్రాయమును దెల్పుటకు కోరబడినవి. కావున జనవరి మధ్యలోగా ఇండియా ప్రభుత్వమువారి యభిప్రాయము నిర్ణయమునకు రాజాలదు.

(అ. ప్రె)

# మరికొన్ని గ్రామములపై

## జరిమానాలు

౧౨ గ్రామములు రు ౧౫౩౦ లను చెల్లింపవలెను

కలకత్తా: డిశంబరు, ౨౩—

నేడు అసామాన్యమైన ప్రకటన గెజెటునందు ఒకటియున్నది. దాని ప్రకారము మిడ్నపూరు జిల్లాలోని కాన్తైయ్ పోలీసు ఠాణా అధికారము లోనుండు ౭ పల్లెలపై ౧౦౦౦ రూపాయలను రామనగరు పోలీసు ఠాణా అధికారమునకు లోబడియుండు ౫ పల్లెలపై రూ ౫౩౦ లను స్పెషలు పవర్సు ఆర్డినెన్సును బట్టి విధింపబడినది.

బహిరంగసభ జరిగెను. గురువాయూరు దేవళములోనికి హరిజనులకు రానీయవలెననియు సుబ్బరాయను రంగయ్యరుగారి హరిజనులు దేవళములోనికి పోవీలు గల్గునట్లు చట్టము నుచేయు ప్రయత్నములు సంతోషకరములనియు తీర్మానములు చేయబడెను అస్పృశ్యతా నివారణసంఘ మొకటి స్థాపింపబడెను

నందిగామలో భజనలు జరిగెను. పరిశుద్ధి మొదలగు మంచి ఆచారముల గూర్చి సవర్ణులు పంచముల యిండ్లకు పోయి బోధించిరి

కవ్వూరమందు పెద్దసభ జరిగెను. అస్పృశ్యులకు గురువయ్యూరు దేవళములోనికి ప్రవేశమును కోరిన తరువాత అస్పృశ్యతా నివారణ సంఘమును సభవారేర్పరచిరి

తెనాలిలో హరిజన దినోత్సవము మహా విశేషములతో జరిగెను ఇచ్చటి విశేషమేమన బావులు సత్రములు దేవళములు వీటికి హరిజనులు రానీయబడిరి. ఇట్లే ఇక ముందుకూడ రానిచ్చుట కంగీకరించిరి

సిరుత్తని, రేపల్లె, నరసాపురము, కాకినాడలలో గూడనిట్లే భజనలు సపంక్తి భోజనములు గురువయ్యూరు దేవాలయములోనికి హరిజనులు రావచ్చునను తీర్మానములు సవర్ణులచే జరుపబడెను.

తిరుచెంగోడు గాంధి ఆశ్రమమునందు శ్రీమతి కస్తూరీబాయి యధ్యక్షత్వమున హరిజన దినోత్సవము జరిగెను, హరిజనుల బిడ్డలకు నూనె శీకాయ మున్నగునవి యిచ్చిరి చాల మంది స్త్రీలకు గుడ్డలనిచ్చిరి. బిడ్డలకు ఫలహారముల నిచ్చిరి తిరుచెంగోడు దేవళము ఎదుట పెక్కువేల మంది కూడిసభలో అస్పృశ్యతా దోషము లను వివరించుచు కస్తూరీబాయిగారుపన్యసించిరి

క్విలనులో సాయంకాలమందు శంటోన్మెంటు మైదానమున బహిరంగసభ జరిగెను ఊర్మిళాదేవిగారును కొండా వెంకటప్పయ్యగారును ఉపన్యసించిరి

భీమవరములో హరిజనసవర్ణులు కలిసి ఊరేగింపులను సభలను జరిపిరి. ఖరగుపురములోను అట్లే జరిగెను గురువయ్యూరు దేవాలయ ప్రవేశమును కోరు తీర్మానము చేయబడెను.

బొంబాయి రాష్ట్రమునందు రాజకోట, సూరతు, ధోలా, బోటాడ ధంధూకా గోధ్రా, నడియాడ, విల్లిపార్లె, బాంద్రా మున్నగు స్థలములలో హరిజనదినము జయముగా జరుపబడెను

లక్నోయందు కూడ అహమ్మదాబాదులోవలెనే కార్యక్రమము జరిగెను తిరుచనాపల్లి శ్రీరంగములలో ౧౭ వ తేదీనాడు వీధులన్నియు తోరణములతో అలంకరింపబడెను ఊరేగింపులు జరిపిరి హరిజన బాలురకు మిఠాయిలు పంచిపెట్టిరి సాయంకాలము ౨౦౦౦ మందికి పైగా హరిజనులు కూడిన బహిరంగసభ జరిగెను

అమలాపురము చెంగల్పట్టులలో కూడ సభలు జరిగెను. హిందూసంఘము నందు అవర్ణులకుగూడ సవర్ణులతో బాటు సమానముగ హక్కులీయవలెనని తీర్మానములు ప్రతిపాదింపబడెను

---

# స్థానిక వార్తలు

## శాసనసభ సమావేశము

నిజాంరాష్ట్రశాసనసభ సమావేశము యిదివరకే పత్రికలలో ప్రకటింపబడినట్లు బహెమన్ నెలలో జరుగక ఇస్ఫందారు నెల ౧౬ వ తేదీనాడు జరుగనున్నది. ఇందు అనాధ శిశు సంరక్షక చట్టము, హిందూ వితంతూద్వాహ చట్టము, మొదలగు ముఖ్య సమస్యలను గూర్చి చర్చ జరుగును. చాల దినములనుండి శాసన సభా సభ్యులుగానున్న మౌల్వీ సయ్యదు అస్కర్ హుసేన్ బారిస్టరుగారికి బదులు ఖలీలుజమాన్ సా॥ బారిస్టరుగారు నియమింపబడిరని తెలియుచున్నది.

---

## కమలనగరు స్టేషనువద్ద సామానులపు పంపుట

౧౯33 జనవరి ౧ వ తేదినుండి ఇప్పుడు పెంచిన విశారాదు. బీదరు రైలుమార్గమందుండు కమలనగరు స్టేషనువద్ద ఏ నిర్బంధము లేక సామానులు పంపుట ప్రారంభింపబడును.

---

## యడ్వన అంగడిమూత

పత్థరుగట్టిలో అల్లాఉద్దీను బిల్డింగులోనుండు యడ్వనప్రభుల అంగడీ డిశంబరు ౨౯,౩౦,౩౧ వ తేదులలో మూయబడియుండును.

---



---

## సత్యార్థప్రకాశము

మహర్షి స్వామి దయానంద సరస్వతులవారి హిందీ గ్రంథమున కాంధ్రానువాదము. పుటలు రాయల్ డబుల్ క్రౌను సైజు కాగితములు. చాలబాగా, ౧ ప్రతికి ౨-౦-౦ తపాలు మాత్రమే లేక ౧-౧-౦ కల్దారు. వెంటనే తెప్పించుకొనుడు. లేదా, మరల నిరాశపడవలసి వచ్చును.

దొరుకు స్థలము.—

ఆర్యసమాజ మందిరము

కిషిదెబ్బిబజారు,

దక్షిణ హైదరాబాదు

---

హి॥ ఘ॥ హ॥ నిజాంగారి సంస్థానపు రైల్వే

## నోటీసు

పూర్ణ హింగోలిశాఖకు చేరిన మార్గమందుండు ధామ్ని స్టేషను, పార్సెల్లను పంపుటకై యింతకుముందు చెప్పియుండినట్లు ఉదయము ౭ గంటలు మొదలు మధ్యాహ్నము ౪ గంటల వరకు గాక, ఉదయము ౯ గంటలు మొదలుకొని మధ్యాహ్నము ౬ గంటలవరకు తెరిచియుండును.

చీఫ్ కమర్షియల్ మేనేజరుగారి ఆఫీసు సికింద్రాబాదు ౨౬-౧౨-౧౯౩౨

డి. బి. ప్రెవరు, చీఫ్ కమర్షియల్ మేనేజర్

---



---

